

ఓమ్.

శ్రీమాన్, బ్రహ్మశ్రీ బెంగుళూరు

పండిత శ్రీనివాస భాగవతస్వాములవారి

జ్ఞానవాసిష్ఠోపన్యాస సంగ్రహము

# వైరాగ్యప్రకరణానుబంధము.

(ఐదవ సంచిక.)

శ్రీయుత, సి. యన్. రావుగారు యిటుల వ్రాసిరి.

క్రిందటి యుపన్యాసమున శ్రీరామచంద్రునికి పదునైదు సంవత్సరముల ప్రాయమప్పుడు రాక్షసులను సంహరించి యాగరక్షణ జేయుటకు తన వెంటపంపమని విశ్వామిత్ర మహర్షి వచ్చి దశరథుని యడుగునప్పుడు రామచంద్రుడు సమస్త కార్యములయందును విరక్తిగలిగి సర్వసంగ పరిత్యాగముజేసిన సన్యాసివలె వైరాగ్యము నవలంబించి యుండెనని చెప్పబడెను.

అంత బాల్యముననే ఆరామచంద్రునకట్టి వైరాగ్య మెట్లుగలిగెనని కొందఱకు సందియముగలుగ వచ్చును. అట్లు విశ్వామిత్రుడు వచ్చి [illegible] ంగ కాలమున రామచంద్రునికి పదునైదేడుల ప్రాయమని [illegible] ముునందు, "క॥ పదియేనేడుల బాలుని సదమల గుణు [illegible] గాకపక్షసంయుతునిట్లే । నవయుత బుద్ధిజాలను ।" అని దశరథుడు విశ్వామిత్రునితో జెప్పినట్లున్నది. అందుననుసరించియే యీజ్ఞాన వాసిష్ఠమందున "శ్లో॥ ఊనషోడశవర్షోయం రామోరాజీవలోచనం" అనియును ఆంధ్రవాసిష్ఠమునందును "వా-వ॥ ఊనషోడశవార్షికుడు రాఘవుడల్ల । దానవులగిట్టి బవరముసల్పు యోగ్యతయు । గానబడదు" అనియును స్ప

ష్టముగ జెప్పియున్నది. మఱియును ధృవప్రహ్లాదుల కంటె కన్నను యల్పప్రాయముననేయట్టి వైరాగ్యముగలిగియుండెనని శ్రీమద్భాగవతప్రమాణమైయున్నది. ఇక్కాలముననే శ్రీవివేకానందులవంటి యవ్వనదశలోనున్నవారట్టి బ్రహ్మజ్ఞానమును గలిగి యుండుటయును యిప్పుడీ సభయందునను అట్టియవ్వనదశయందున్నవారు జ్ఞానమును బడయగోరి శ్రవణమునతిశ్రద్ధాపరవశులై జేయుచుండుటయును ప్రత్యక్షముగ జూచుచుండగా, ఆకాలమున అవతారమూర్తియైనయారామచంద్రున కంతటిప్రాయమునగలిగెనను విషయమాశ్చర్యకరమైనదిగాదు. గ్రంథములెట్లుప్రమాణములనినమనతంత్రులపేళ్ళు జెప్పకొనుటకు మనతల్లుల మాటలెట్లు ప్రమాణములో యట్లేయవియును ప్రమాణము లనదగును.

అయినను వేదాంతశ్రవణమునందు సారాంశములను గ్రహించి జ్ఞానమును సంపాదించుకొనవలయునను తలంపుగల అనసూయాపరులకట్టి మాటలును వాదమును అనావశ్యము. మావిడిపండ్లు దినగోరి యిరువురు మనుజులొక మావిడితోటకుబోయిరి, వారిలో నొకడు యాతోటవానిని నయభయములచే వంచించి యొక పండు సంగ్రహించుకొని పోవలయునను దురుద్దేశముతో నీవెవరు, నీయజమానుడెవరు, యిందున నెన్ని చెట్లున్నవి, యింత చిన్నచెట్లయందెట్లు యింత పెద్దపండ్లు ఫలించినవి యనుమాటలచే ప్రొద్దుబుచ్చుచుండెను. మరియొకడు సందడిలేక యాతోటవానిచే నొకడబ్బుపెట్టి మంచిపండొకటి దీసికొని దిని మనసుతృప్తిగ నింటికిపోయెను. తుదకామాటలాడుచుండినవాడు అస్తమానమువర కటుల మాటలాడుచుండి ఆతోట యజమానివచ్చి కోపించగా పండు దిను ప్రాప్తిలేక వచ్చినత్రోవనె చక్కగ బోయెను. గాన మనస్సునందు సందియమునుంచుకొనక సమాధానపరచుకొనుట సాధనచతుష్టయమునందొక్క ముఖ్యమైనయంశమని యిదివరకే చెప్పబడినది. అదియును "గీ॥ మనసు చల్లబడక మాటలెన్నాడిన । ముక్తిగాదు వాదశక్తిగాని । మనసె కారణంబు మఱిబంధమునకు మోక్షమునకు" అనియును జ్ఞాపకమునందుంచుకొనవలయును.

అట్లు రామచంద్రుని వైరాగ్యస్థితినంతయును దశరథుని సభలో భృత్యులుజెప్పి రామచంద్రుని ప్రపంచవ్యాపారమునందు ప్రవేశపెట్టగల సమర్థులైన మహానుభావులెవరో తెలియదనిరి. విశ్వామిత్రు డదివిని మీరు

రామచంద్రునీ యిచ్చటికి దీసికొనిరండని భృత్యులనుపంపి, రామచంద్రున కిట్టి చింత యేదైన యాపదవలనగాని ఆశాభంగమువలనగాని గలిగినది గాదు, ఇది సువివేకమువలనను వైరాగ్యమువలనను గలిగి గొప్పముక్తి ఫలమునిచ్చునది. యుక్తిచేత దీసినిబోగొట్టిన మావలె సారతరమైనసర్వో త్తమ పదమునందు విశ్రాంతినొందును అనివిశ్వామిత్రుడు చెప్పుచుండగా రామచంద్రు డచటికి వచ్చి,

శ్లో॥ ప్రథమం పితరంపశ్చా న్మునీమానైర్వ్యకమానితా ।
తతోవిప్రాన్ తతోబంధూ న్ప్రణనామతతోగురూన్ ॥"

,మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ, అని యున్నదిగాన తండ్రియైన దశరథుడు మొదటిగురువనియును ఋషులతో సమానుడనియును, ముందు తండ్రికినమస్కరించి, పిదప వసిష్ట విశ్వామి త్రులకును, పిమ్మట తక్కినవారలకును నమస్కరించి నిలుచుండెను.

అప్లున్న రామచంద్రుని దశరథుడుజూచి "ఉత్సంగే పుత్రతిష్ఠేతి," "వత్సారమ్మని డగ్గరంబిలచి విశ్వాసంబుతో రాజునై । జోత్సంగాగ్రము జెందుమి (నాతొడయందు గూర్చుండుమీ) యనిన సర్వోత్కృష్ట తార తమ్యాసం । పత్సంపన్న వసిష్ఠ ముఖ్యముని విప్రశ్రేష్ట సాన్నిధ్యమం । దుత్సంగస్థితినొండ (తొడపై గూర్చుండ) గూడదని" తలంచి "భూమా పరిజనాస్తీర్ణే, చాసనే సన్యవిశతః"— "పరిజన కృతవ । స్త్రావర ణాన్వితభూమిన్ । రివిన్ గూర్చుండె రాజ డింభకుడంతన్॥"

అప్లుభూమిపై గూర్చున్న రామచంద్రునితో, పుత్రా! వివేకము గలిగినట్టిన్ని, మంగళప్రదుడవైనట్టిన్ని, పెద్దలుజెప్పిన ధర్మములనాచరిం చునట్టిన్ని, అతిసులభముగ పుణ్యపదమును బొందగలిగినట్టిన్ని, నీవుమూ ఢునివలె యెందుకొఱ కిట్టిచింతను బెట్టుకొని క్షీణించుచున్నాడవు, యెం తవరకు చింతకు యెడమివ్వకుండుదువో అంతవరకు ఆపదలు నిన్నంట జాలవు అనిదశరథుడుజెప్పగా వసిష్టమహర్షి జూచి, దుర్వ్యాపారయుక్త మైనట్టిన్ని నిర్మూలముజేయనుశక్యముకానట్టిన్ని విషయశత్రువులనుజయించి నవాడవైన నీవుఅవివేకునివలెయెందుకుయిట్టిచింతనుజెందుచున్నాడవు, అని యనుచుండగా, విశ్వామిత్రుడందుకొని, రామచంద్రా! చక్కగ కట్టబడిన యింటిని యెలుకలు ద్రవ్విపోసినట్లు నీమనస్సునందిట్లు ,శ్లో॥ కిం నిష్ఠాక చ లేకేన । కింయతః కారణేనతే...... " ,,మ॥ ఏవిషయంబుకై మరి

యము నేమిటికెంతటి దానికెందుకై । యీవిధమై మనోగృహము నెలరఁల రీతిగ నాధిసంఘముల్ । వావిరి బ్రొవ్వుచుండెడి నిదైశమె (సీఘ్రముగ) చెప్పుము దానిబాధల । స్నీవికజెందకుండునటునేర్పుగ బొందెద వెల్లకో రేఁలరా॥'' అని నీమనోభావము సీఘ్రముగజెప్పుమని విశ్వామిత్రుడడిగిన, యాకాలోచితమయిన అర్ధసంపదగలవాక్యముల నాలకించి దుఃఖమును వదలి రామచంద్రుడు బదులుజెప్పదొడగెను.

స్వామీ? నేను అజ్ఞుడనైనను మీరడిగినందున నాదుఃఖకారణమును తెలిపెదను ఆలకింపుము. నేనిచట పుట్టిపెరిగి విద్యలన్నియునుజదివి సత్కర్మములయం దాసక్తిచే తీర్థయాత్రచేసివచ్చినంతట నాకీప్రపంచమునఁద లి సంసారాస్థపోయి యీవిచారముపుట్టినది.

శ్లో॥ కింనామేదం వదసుఖం । యేయంసారసంస్థితిః ।
జాయతే మృతయేలోకో । మ్రియతే జననాయచ ॥''

''గీ॥ పుట్టురూపంబులెల్లను, బొలియు (చావు)కొఱకె ।
పొలియు (చచ్చు)టెల్లను, గ్రమ్మరబుట్టుకొఱకె ।
కాని యెందును నిలుకడ, గానలేని ।
యిట్టి సంసారమున సుఖమెద్దిగలదు ।''

''శ్లో॥ అస్థిరాస్సర్వయేవైతే, సచరాచర చేష్టితాః,
సర్వాపదాం పదంపాపా, భావావిభవ భూమయః॥

''శ్లో॥ కింమే రాజ్యేన కింభోగైః, కోహంకిమిద మాగతం।
యన్మిథ్యా వాస్తుతన్మిథ్యా, కస్యనామ కిమాగతం॥''

సమస్తపదార్థములును అస్థిరములును, పాపహేతువులును, అన్నివిధములైన యాపదలకును మూలమైనదియునై యుండగా,

''గీ॥ అస్థిరంబులు సర్వంబునని యెరింగి।
రాజ్యసుఖములకెట్లను రక్తిగాడము।
యేమి భోగంబునాకిది యేమివచ్చె।
నకటయెవ్వండనేనని యాత్మదలతు॥''

మరియును.—

''శ్లో॥ శామ్యతీదం కథందుఃఖ, మితితప్తోస్మి చింతయా + + x''

''శ్లో॥ సంసార దుఃఖపాషాణ, నీరంధ్రహృదయోహ్యహం।
నిజలోకభయాద్యేన, గళదాన్యం న రోదిమి॥''

,,గీ॥ ఇట్టిదుఃఖంబునాకింక నెట్లుదొలగు।
నసుభయయంబున దుర్వ్యథదనరుచుండు + × + ''
,,గీ॥ —— ఘనశోకమొదవిబంధులు।
వినివగచెదరనుచు నేడ్వ వెరతుమునీంద్రా॥'' యీప్రకారమే,

# ధనము.

,,శ్లో॥ చింతానిచయచక్రాణి, నానందాయధనానిమే।
సంప్రసూతకళత్రాణి, గృహాణ్యాగ్ర్యపదామివ॥''

అనేక సంకటములుగల వారికి అతిసంతానవతులగు భార్యలుగల గృహములవలె, సంసారమునందు అనేక చింతలచే చుట్టబడియుండు దారిద్ర్యమున్ను దుఃఖమునేగాని సంతోషమును గలుగజేయదు, గాన,

''క॥ ఏవిధమున తలపోసిన।
నావిషమునునాకు నరుచియగు సంసారం।
బేనెట్టుల దరియింపుదు।
నేవెరవున విశ్రమింతుసిద్ధచరిత్రా॥'' యిదిగాక,

,, శ్లో॥ గుణాగుణ విచారేణ, విద్యైవకిల పార్శ్వగం।
రాజప్రకృతివన్మూఢా, దురారూఢావలంబతే'',,

రాజులు గుణాగుణములను విచారించక సఖ్యమును జేయుచుండదమున ధనమున్ను వుత్తమాధమలను వితరణ సెయుగక చెంతనున్న వారిచేత జేరును,

,, శ్లో॥ —— దోషాశీవిషవేగస్య, యత్క్షీరంవిసరాయతే॥,,

పాలచేనిండియున్న కుండలో నొకబొట్టువిషముగలసిన పాలునంతయూ నావిషవేగను యెట్లుప్రసరించునో యట్లే ధనముతోగలసి యహంకార మమకారములును యభివృద్ధిని జెందును,

,, శ్లో॥ ప్రాజ్ఞాశ్శూరాః కృతజ్ఞాశ్చ, పేశలామృదవశ్చయే।
పాంసుముష్టేర్యవమణయః, శ్రియాతే పరుషీకృతాః॥

యెట్టిసమర్థులైనను, యెట్టిమృదుస్వభావముగలవారినైనను దుమ్ముపిడికిటిచే నదుమబడిన రత్నములవలె మూఢులుగను, కఠినమానసులుగను, జేయును;

,,శ్లో॥ మనోరమాకర్ష తిచిత్తవృత్తిం। కదర్థసాధ్యాక్షణ భంగురాచ॥ ।
వ్యాయామవళీగాత్రనివృత్తదేహ। శ్వభ్రోద్ధితాపుష్పళతేవలక్ష్మీ॥,,

ఒకపాముభావిలోపల సర్పముచే చుట్టుకొనబడియున్న పుష్పలతయందున్న పుష్పమును గ్రహించుటకెంతటి ప్రయాసగలుగునో అట్లుద్రవ్యము నీచసేవాది వృత్తులచే మిగుల ప్రయాసపడి పొందదగినదియును క్షణమాత్రమున నశించునదియునునై చిత్తవృత్తి నాకర్షించుచున్నది, యని రామ చంద్రుడు ద్రవ్యసంపదస్వభావమును జెప్పెను.

ఇందున దెలిసికొనదగిన సారాంశము లేమనగా.— సదా మే, మే, యని యఱచు మేకవలెనే, ప్రపంచమునందుబుట్టు ప్రతిమనుజుడున్ను పుట్టునప్పుడేమియును తనతో దీసికొనిరాక తర్వాత, ,,అపత్యం మే, కళత్రం మే, గృహం మే, బాంధవాశ్చమే” యనగా, సంతానమునాది, భార్య నాది, ఇల్లునాది, బంధువులు నావారు, అన్నియును, మే, మే, నాది, నాది, యని యఱచియఱచి చచ్చి, తనతో నేదియును దీసికొనిపోక అన్నియును వదలిపెట్టిపోయి ,,పునరపి జననం పునరపిమరణం । పునరపిజననీ జఠరేశ యనం,,— యీరీతిగ పుట్టుచు జచ్చుచు మరలపుట్టుటకు తల్లిగర్భమును మలమూత్రమయమగు మహాఘోరనరకరూపమునబడుచు, ,,జాతస్యహి ధృవోమృత్యు,,— పుట్టుటగిట్టుట కొఱకే యనియును,, ,,ఇహసంసారే బహుదుస్సారే,, యనియును, సంసారం సాగరందుఃఖం, యనియును, ,,యద్దృశ్యం తన్నశ్యం, యనియును యుండుటవలన, యీశరీరమును, యీ సంసారమును, కండ్లకుగనుపడుయితరపదార్థములన్నియును, అస్థిరములని యును, అన్నియాపదలకును, అపారమయిన దుఃఖమునకును ఆస్పదమయి నవనియును, (మిధ్య) అబద్ధములనియును, యేమాత్రమును సుఖముగాని సంతోషమునుగాని సత్పదవినిగాని యివ్వనేరవనియును చక్కగ దెలిసి కొని దృఢమయినమనస్సుతో యీశరీరసంసారాదులయందు భ్రమలను కోరికయును వదలి విరక్తిజెంది, చావుపుట్టువును దుఃఖమునులేని శాశ్వతమగు సుఖానందపదవిని బొందగల మార్గమును వెదకి సంపాదించు కొనవలయును. ధనమువలనగూడ యేమాత్రమును ప్రయోజనములేదు. ,,అర్థానేదుఃఖం, వ్యయేదుఃఖం కిమర్థం, దుఃఖభాజనం!,, ధనమునుసంపా దించుటయందున్ను కష్టమే, కాపాడుటయందున్ను కష్టమే, వ్యయపరచు టయందును కష్టమేగాన, అట్టికష్టములవలననే దుఃఖము గలుగుచున్నది.

మరియును ధనము కొట్టిసమర్థునైనను మూర్ఖునిగను కఠినమానసునిగను జేయును. ఇందుకు దృష్టాంతము.— అతిసమర్థుడును శాస్త్రవేత్తయును మిక్కిలి ద్రవ్యార్జన జేయుచున్న యొక ధనికునివద్దకు యొక దరిద్రవిప్రుడు బోయి యీడుమీరుచున్న తనకుమార్తెకు వివాహముజరుపుట కేమయిన ద్రవ్యసహాయమును జేసి యొకకన్యాదాన ఫలమునున్ను, అందున జరుగు బ్రాహ్మణసంతర్పణ ఫలమునున్ను బొందుమనియాశీర్వదించి,, నహీనహిబహు దానా అన్నదానస్సమానా,, యనుమొదలయిన శ్లోకములను జెప్పి యాచింపగా, ఆధనికుడాదరిద్రుని యతివినయవిధేయ మర్యాదలతో కూర్చుండబెట్టి తాను అనేక నీతి శ్లోకములను జెప్పితుదకు నీకింతటిదరిద్రమెందుచేత గలిగినదని యడిగెనుఅందుకావిప్రుడు నాపూర్వజన్మకర్మమువలన నేనిట్లు దరిద్రుడనై యుండునట్లు భగవదనుగ్రహమాయెను. అందుకా ధనికుడు, అది భగవదానుగ్రహమైయున్న అందుకు విరోధముగ నేను నీకు ద్రవ్యసహాయముజేసిన నాకు భగవదపరాధము సంభవించుననిజెప్పి యేమియు నివ్వకనేబొమ్మనెను. ఇట్లుకఠినముగాజేయబడిన హృదయముగల కొందరి దురభిప్రాయము. ఇందున గూర్చి శ్రీవివేకానందస్వాములవారు "*God has created the poor in order that the rieh may have an opportunity to serve Him by charity and service*" దానధర్మాదిసత్కార్యములనుజేసి భగవంతుని సేవజేయుటకు భాగ్యవంతులకు అవకాశముగలిగియుండుటకై భగవంతుడు బీదవారిని సృజించెను, అని యుక్తియుక్తముగ జెప్పియున్నారు. ధనమిచ్చిన మదమెచ్చును అనునట్లు అహంకారాదులను హెచ్చించును గాననే ,పరనిందబడని ధనికుడు పురుషోత్తమ దుర్లభంబుభువినిక్కదలపక॥, యని రామచంద్రుడు జెప్పినట్లు యెంతటి యాప్తబంధువులను మిత్రులనైనను క్షణమాత్రమున పరమశత్రులనుగజేయును. ధనమునుజూచి యొకమహానుభావుడు ,ఓధనమా, నీకుదండముబెట్టెదను, నీవు నాకండ్లకెదుటబడక తొలగిపొమ్ము, అనియొక కీర్తన నిట్టుల వ్రాసియున్నాడు. పల్లవి॥ పణమే, వున్నాల్ యెన్నగుణమే, దండం పణ్ణినేన్ శట్టుంయెన్ కణ్ణిల్ముక్ నిల్లాదే॥ అనుపల్లవి॥ గుణమిల్లామద, మోహంక్రోధం దుర్ । మార్గముంమూర్ఖముం, యారుకుంమేబోధికుం॥ పణమే॥ చరణం॥ తేడివున్నై వైత్తు, కూడియవరుం- నీ దీర్ఘాయుసు, తరువారో । ఇని నాడియమక్కవందు, శాడిదుంబోదునీ-

సానస్థ్రమముణ్, వరువాదో! కూడియపేర్గళ్, కుడియకెడుప్పాయే-కొల్లవొల్లిపిళ్ళం; కాట్టికొడుప్పాయే! వాడివాడి అప్పత్తైపోయి అడుప్పాయే, వృత్తమగైకండాల్, వోట్టంయెడుప్పాయే॥ యని నట్లు వృత్తములనుజేరక అఘములనుజేరుచు అన్నియాపదలకును మూలకారణమై యున్నది. ఇట్లు,

సీ॥ కామమోహాది, దుష్కరశత్రువర్గప్రతాపపరిధాన, సాధనము
ధనము, జన్మపరంపరా, సంపాదితానేక, ఘనకర్మజాల, వర్ధనము ధనము।
కైవల్యసంప్రాప్తి, కారణవైరాగ్య, ధర్మమార్గావ, రోధనము ధనము।
సకలాఘపుంజ, సంశ్రయాశారూప, దారుణనిగళ, బంధనము ధనము।
గలిగి, గర్వంబు దొట్టి, దుఃఖంబుమదికి। బెనుచు, నజ్ఞానపావ, కేంధనము
ధనము। స్వప్నలబ్ధపదార్థంబు, చందమునను। దలచిచూడంగపట్టి, దంధనము
ధనము॥ గావున

క॥ ఏనుదుఃఖంబుల దిగద్రో।
చినపురుషుడు సౌఖ్య సక్తచిత్తుడుగాకా।
దిని వైరాగ్యము జెందిన।
ననుపమమగుపరమపదము నమ్మోయిజేర్చున్॥ అనగా

సంసారబంధమునందుగల దుఃఖము మనస్సునందుదోచిన మనుజుడు, అట్టిసంసారము నందు బడి, సౌఖ్యముకు గోరక, అందునబడకయే, యాదినుండివైరాగ్యమార్గము నవలింబించిన, నదియే పరమపదమునకు దీసుకపోయి జేర్చునని, శ్రీమహాభారత శాంతి పర్వము చతుర్థాశ్వాసమున భృగుమహర్షి భరద్వాజునకు జెప్పినటుల, శ్రీరామచంద్రుడును సంసారబంధమున బడక పూర్వమేదనమనస్సునందు దుఃఖము గలిగినతక్షణ మేతన వివేకము వలన యంతబాల్య దశయందే యట్టి గట్టి వైరాగ్యమును గలిగి యుండెను.



ఓమ్.

శ్రీమత్, బ్రహ్మశ్రీ బెంగుళూరు

పండిత శ్రీనివాస భాగవతస్వాములవారి

జ్ఞానవాసిష్ఠోపన్యాస సంగ్రహము

# వైరాగ్యప్రకరణానుబంధము.

(ఆరవ సంచిక.)

---

శ్రీయుత, సి. యన్. రావుగారు యిటుల వ్రాసిరి.

---

అట్లు శ్రీరామచంద్రుడు సంసార ప్రయోజనసిద్ధికి ప్రధానంబైన ధనముయొక్క స్వభావమును, దానియందున తనకుగల వైరాగ్యమును జెప్పి, విశ్వామిత్రునితో మరల నిట్లనెను. స్వామీ, మరియొకటి యేదియనిన; ధనముగలిగియుండినయెడల బహుకాలము భోగించుటకై మనుజులు అపేక్షించునట్టి

## ఆయువు.

"శ్లో॥ ఆయుఃపల్లవకోణాగ్ర - లవాంబుకణభంగురం।
ఉన్మత్తమివసంత్యజ్య - యాత్యకాండేశరీరకం॥"

ఈఆయువు (ప్రాణము) చిగురుటాకుకొనయందుండు వుదకబిందువువలె అనగా, తలక్రిందుగానుండెడు ఆకు, అందులో మృదువైన చిగురుటాకు, దానియొక్క కొనయందు ముత్యపుతోంగటమువలె నంటుకొనియుండు నీటిబొట్టు యెప్పుడు జారిపడినను పడిపోవును, అటువలెనున్ను, వచ్చినవాడు వున్నచోటనుండి యెట్టిసమయమునందైనను లేచిపోవును, అట్టు

వలెనున్న, యున్నదిగాన, ఆయువు, జ్ఞానమునందు ముదరని అజ్ఞానమను చిగురుటాకువంటి శేతప్రాయముననే గాని మరియెప్పుడైననుగాని శరీర మునుండి చెప్పకనే లేచిపోవును.

"శ్లో॥ విషయాశీవిషాసంగ - పరిజర్జరచేతసాం ।
అప్రౌఢాత్మవివేకానా - మాయురాయాసకారణం ॥"

ఇంద్రియవిషయములను సర్పములయొక్క సంసర్గముచే చెడియున్న చపలచిత్తవృత్తిగలిగి ఆత్మజ్ఞానములేనివారిలకు దీర్ఘమగు ఆయువు వుండి యును ఆయాసకారణమగునుగాని సుఖమున కేమాత్రమును సాధకము గాదు. సుఖములేక, ఆయువు ఆయాసకరమైన దుఃఖము గలుగుటకు కారణము. అజ్ఞానమువలన గలిగిన చిత్తచాపల్యము, చిత్తచాపల్యమున కు కారణము, సంసారబంధము, సంసారబంధమునకు కారణము సంతా నము, సంతానమునకు కారణము కళత్రము (భార్య) ఇట్లు అన్నిటికిని మూలకారణమైన కళత్ర మెట్టిదనగా,

"శ్లో॥ యాం ఆరాధ్యం, నగణితమిదం, జీవితంవాధనంవా ।
యస్యాఃప్రీతిః, మనసికవితా, జ్యాయసీ మోక్షతోః ।
సైవేదానీంవయసిచలితే, సంప్రహీణేచవిత్తే ।
తూలాయాపి, త్రిపురహర, మాం మన్యతేనైవభార్యా ॥"

యని నీలకంఠదీక్షితులవారు కలివిడంబరము, అను గ్రంథమునందు జెప్పియున్నట్లు, అర్ధప్రాణములకన్నను, కళత్రమే ప్రధానముగను మోక్ష కారిణిగను యెంచుకొని పూజించుచుండినను తుదకట్టి కళత్రముగూడ భర్తయొక్క వార్ధకదశయందునగాని రిక్తదశయందునగాని యాభర్తను యేమాత్రము లక్ష్యముబెట్టక విడనాడును, కడవరకు తనకు సుఖకరమని యెంచియున్న యట్టి జ్ఞానహీనునికి అత్యాప్తమైనదనుకొనిన దనకళత్రమే అట్లు తనను విడనాడినవానికి ఆయువు అతిబరువై ఆయాసకరమనిదోచి దుఃఖమును గలిగించుటకు వేరేమి కారణముగావలయును.

రామచంద్రుడు మరియు నిట్లనియె:— ఓమునీంద్రా! స్థిరమైన వస్తువునందు నమ్మకముగలవాడనై అస్థిరమయిన శరీరమును స్థిరమయిన

దనుకొని సంసార మను మేఘమునందు మెరుపుతీగవంటి అస్థిరమయిన ఆయువునందు నాకు ఆసక్తిలేదు. గాలినైన నునుబట్టి నిలుపవచ్చును, ఆకాశమునైనను నలుకవచ్చును, నీటిపైలేచి యణగెడి అలలనైనను జేర్చిపట్ట వచ్చునుగాని, అస్థిరమయిన యీఆయువునందాసక్తిని పెట్టతగదు. శరత్కాలమునందు వేగముగ బారుచుండెడి మేఘమువలెను, చమురులేని దీపమువలెను, చిన్న అలలవలెను చంచలమయిన యీఆయువు పోతూనేయున్నదిగాని స్థిరముగ నిలువడములేదు.

"శ్లో॥ అవిశ్రాంతమనాశ్వాస్య - మాయురాతతమీహతే ।
దుఃఖాయైనవిమూఢాంత - గర్భమశ్వతరీయథా ॥"

గుఱ్ఱమువలన గాడిదెయందుబుట్టిన సంకరగాడిదెకు అశ్వతరి, యని పేరు. అట్టిఅశ్వతరికి గర్భము నిలిచెనేని యది చచ్చునని వాడుక, గాన ఆత్మవిశ్రాంతిలేని మూఢుడు బ్రహ్మజ్ఞానచింతలేక వ్యర్థముగ యీగాడిదె గర్భమువలె దుఃఖముకొఱకే దీర్ఘాయువును గోరుచున్నాడు.

(ఇందుకొక దృష్టాంతము:— ఒకానొక మనుజుడు యొకధనికుని యింటబుట్టి చదువును సంధ్యయును యేమియునులేక చల్వముగా పెరుగుచుండి, మంచి యవ్వనమునందు తండ్రిచనిపోవుటవలన ద్రవ్యమంతయును దనచేతికివచ్చి తనయింటికి తానే ప్రభువై, ధన వనితావిషయాదులయందు విచ్చలవిడిగ దనమనస్సును విడచి పరమ అజ్ఞానియై దిరుగుచుండెను,

శ్లో॥ యవ్వనం ధనసంపత్తిః ప్రభుత్వ మవివేకతా ।
యేకైకమప్యనర్థాయ కిం యత్ర చతుష్టయం ॥"

అనునట్లు, యవ్వనమును, ధనమును, ప్రభుత్వమును, అవివేకమును, అను యీనాలుగింటిలో, ఒక్కొటొకటియే అనర్థమునకు కారణమైయుండగా, యీనాలుగును గలిగియుండినట్టివానికి మిక్కిలి అనర్థకారియై స్త్రీ విషయాదుల వలనను జూద పానాదులవలనను వున్న ధనమెల్లనుబోయి దరిద్రుడై రోగపీడితుడై తనకు షష్టిపూర్తియగునంతకు మిగుల బలహీనతచే శల్యగతుడై నిలువనిల్లులేక లజ్జా దుఃఖములతో తనగ్రామమున తల

తప్పించి పొరుగూరికిబోయి బ్రదుకదలచి మిగుల ఆయాసముతో నడవ లేక యెండగొట్టున అతి బడలికతగిలి బోవుచుండగా, దారిలో ధర్మార్థము చలిపందిరి పెట్టుకొనియున్న యొకవృద్ధాత్ముడు జూచి జాలిపడి అయ్యా, యికను యొక అడుగైనను బోజాలవు యిందునవచ్చి దప్పిదీర్చుకొని కొంచము విశ్రమించుమని చెప్పగా, ఆముసలివాడు "అయ్యో! వాడు నశించిపోనుగాక, వానికి బొత్తిగబుద్ధిలేదు, వాడు నశించిపోనుగాక" యని శపించసాగెను. ఎవరి నట్లు దిట్టెదవని యావృద్ధాత్ము డడుగా, ఆముసలివాడు, యెవరినిగాదు సృష్టికర్తయని పేరుపెట్టుకొనియున్న యాబ్రహ్మను దిట్టెదన; మనుజునకు "శతమానం భవతి" యని నూరేండ్లు విధించినవాడు యేబదియేండ్లు గడచిన వెంటనైనను, నలువది తొమ్మిది, నలువది యెనిమిది, యని మరల ప్రాథత్వమునకు దీసుకరాక, అరువది, డెబ్బది, యెనబది, యని యిట్టిభారమయిన ముదిమికి దీసికొనిపోవు యాబ్రహ్మను గదా దిట్టుచున్నాను, అనెను. ఆరీతిని ఆత్మజ్ఞానము లేనివారలకు ఆయువు ఆయాసమునకే కారణమగును. అట్లు ఆయాసమునకుకారణమనియును మోయుటకు భారమనియును యెఱిగియుండియును ఇంద్రియవిషయాది అజ్ఞానముచేత మరలగోరుచుందురు.)

"శ్లో॥ ప్రాప్యం సం ప్రాప్య తేయేన । భూయోయేననశోచ్యతే।
పరాయానిర్వృతేస్థానం - యత్తజ్జీవితముచ్యతే॥"

యే ఆయువుచే బ్రహ్మజ్ఞానములభించునో, యే యాయువు దుష్కర్మలనుజేసి తిరుగా దుఃఖములను చెందవో, యేయాయువు వుత్తమమైన అచల నిర్వాణ సుఖానందమునకు స్థానమగునో అట్టిదియే, ఆయువుగాని తక్కినది యాయువుగాదు. అనగా, తక్కినవారి బ్రతుకు బ్రదుకుగాదు.

"శ్లో॥ తరవోపిహిజీవంతి - జీవంతి మృగపక్షిణః।
సజీవతిమనోయస్య - మననేనైవజీవతి॥

మృగములు, పక్షులు, వృక్షాదులుగూడ జీవించుచున్నవి. వాటి వంటి బ్రతుకు బ్రతుకు గాదు. యెవడు బ్రహ్మ వస్తువును సదా మననము చేయుచున్నాడో, అట్టివానిదే బ్రదుకనదగును. జగమునందు జననమృత్తి

జ్ఞానమును సంపాదించి మరల జననములేనిపదవిని బొందువారెవరో అట్టి వారలే జనన మెత్తినవారుగాని ,, శేషాజఠరగర్భబాః, తకీర్తనవారు మూస లిగాడిదెతో సమానులు అని రామచంద్రుడు చెప్పెను.

,,శ్లో॥ భారో వివేకినశ్శాస్త్రం - భారోజ్ఞానంచరాగిణం।
అశాంతస్య మనోభారో - భారోనాత్మ విదోవపుః॥

వివేకములేనివానికి శాస్త్రము బరువుగనుండును, చిత్తశాంతి లేనివానికి మనస్సు బరువుగనుండును రాగద్వేషాది గుణములుగలవానికి ఆత్మజ్ఞానము బరువుగనుండును,

ఇట్లు చిత్తవిశ్రాంతిలేక అజ్ఞానమునందుబడియున్నవారికి శరీరమును, సౌందర్యమును, ఆయువును, మనస్సును, విద్యయును, బుద్ధియును, అహంకారమును, అన్నిచర్యలును, బరువులై, బరువును నతికష్టముతో మోయువానికివలె దుఃఖకరములైయుండును. ఇట్టిచిత్తవిశ్రాంతిలేని దుఃఖమునకు 'మనయేవమనష్యాణాం' అను శ్లోకమునందు యిదివరకే చెప్పబడినట్లు మనస్సే కారణమైయున్నది. ఇందువిషమై శ్రీరామలింగస్వామివారిట్లు శివునితో మొరబెట్టుకొనిరి,

"నాక్ పడుంపాడు,శివమే, ఉలఘేర్నవిలుం, పజ్జిత్తాక్ పడుమో, శొల్లత్తాక్ పడుమో, యెణ్ణత్తాక్ పడుమో + + + "

ఓస్వామీ ! నేను పడునట్టి పాట్లు ప్రపంచమునందు మూడికూడా పడదు. అనగా, ప్రత్తికాయను దెచ్చి దూదిగాగొట్టి, నూలుగా వడికి, వస్త్రముగా నేసి, కట్టికట్టిమాపి, గుంజిగుంజి, పిండిపిండి, ప్రాతపేలికలైనవెనుకగూడ విడువక దివిటీలకు జుట్టి చమురునం దడపి కాల్చెదరు. ఇట్టిదూది పడుపాట్లనైనను యెంచదగును గాని నేను పడుపాట్లను యెన్నదరముగాదు, చెప్పను దరముగాదు, అని మొరబెట్టుకొనిరి. మరియును, చిత్త విశ్రాంతికొఱకై శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యులవా రిట్లుల జెప్పిరి.

" శ్లో॥ కరస్థే హేమాద్రౌ, గిరిశ, నికటస్థే ధనపతౌ।
గృహస్థే, స్వర్భూజామర, సురభిచింతామణిగణే।
శిరస్థే, శీతాంశౌ, చరణయుగళస్థేఖిలశుభే।
కమర్థం, దాస్యేహం, భవతు, భవదర్థం మమమనః"

అనగా:ఓ మహేశ్వరా! నిన్ను స్వర్ణముతో పూజింతుననిన హేమాద్రియే నీచేతనున్నది, ధనముతో పూజింతుననిన కుబేరుడు నీసమీపమునందున్నాడు, ఫలాదిభక్ష్యములతో పూజింతునని కోరిన కల్పవృక్షాదులు దేవలోక చింతామణి నీకున్నది, నీకు అభిషేకము చేయవలెనన్న అభిషేకము చేసినయెన ను చల్లపరచు చంద్రుడే (చంద్రుడే) నీశిరమునను న్నాడు, శుభకరమైన పుష్పాదులతో పూజింతుననిన, సర్వశుభములును నీపాదములయందే యున్నవి. గాన, నాదాస్యమువలన నేమియును ప్రయోజనము లేకయున్నందున అతిప్రియాసపడి జ్ఞానవైరాగ్యముల నిలకడగబెట్టుకొని యున్న నిర్మలమయిననామనసును నీకర్పించెదను. అని జెప్పిరిగాన మనసును దుర్వృత్తులయందు ప్రవర్తింపజేయక నిర్మలముగ నిలిపి శీఘ్రముగ భగవదర్పితముజేయను ప్రయత్నించవలయును.

" శ్లో॥ దుర్జనస్సజ్జనేనేవ - యౌవనేనవియుజ్యతే ॥"

సజ్జనుడు దుర్జనునితో సహవాసముచేసికొన్న దినములకే వాడు దుర్జనుడని దెలిసికొని వానిని యనాదరణజేసి విడనాడిపోవునట్లు ఆయువు యీశరీరమును వదలి యెప్పుడైనను లేచిపోవును. ఇది జ్ఞాపకమునందుంచుకొనక కొందరు బాల్యదశయందున్నప్పుడు కౌమారమున్నదిగదాయనియును, కౌమారమునందు, యౌవనమున్నదిగదాయనియును, యౌవనమునందు, వార్ధికదశయున్నదిగదా, అప్పుడు జ్ఞానము సంపాదించుకొనవచ్చుననుకొని కాలము వ్యర్థముగ గడపెదరు. అనిత్యమయిన ఆయువు శరీరమునందుండగనే బాల్యయౌవనదశలని యోచించక ఆత్మానాత్మవివేకమును సంపాదించుకొని ఆయువు యెప్పుడు యీశరీరమును వదలిపోయినను మరల యెట్టిజన్మమునులేని పదవినిబొందుటకు సిద్ధముగ నుండవలయును. అట్లుగాక, వ్యర్థముగ కాలముగడపి శరీరమును వదలి పోవువానిని గురించి యొకమహానుభావుడిట్లు జెప్పెను:—

“నందవనత్తిల్ - ఓగాండి - అవన్ నాలారుమాదమాయ్, కుయ వనై వెండీ । కొండువందాన్ వారుతోండి । అవన్ కూత్తాడి - కూత్తాడీ - పోట్టడిచ్చాండీ॥ తపదండ్డి - నానన్డి - నానా॥”

ఈపల్లవి, నాది, నేను, అను మమకారాహంకారములను దెలుపుచున్నది. యెట్లనిన.—

ఒకడు పదిమాసములుగా యొక కుమ్మరవానిని ప్రార్థించి యొక ఘటమును, (కుండను) సంపాదించి తెచ్చుకొని నాది నేను అని యాడీ యాడి యాకుండను కొన్నినాళ్లు అన్నిపాట్లనుబెట్టి కడపట వ్యర్థముగ పగలగొట్టెను అనగా, తల్లిగర్భమునందున్న పదిమాసములున్న భగవంతుని ప్రార్థించి యీశరీరమును దెచ్చుకొని భూమిపైబడి అహంకార మమకారాదులచే కొన్నినాళ్లు అన్నియాటలాడి అన్నిపాట్లనుబడి తుదకీ శరీరమును దెచ్చికొనియు వ్యర్థుడై అవసానకాలమువర కాత్మజ్ఞానము లేకయే మృతిబొందుచున్నాడని యర్థము. ఇందున కొక దృష్టాంతము. ధనికు డొకడు దాను అనుభవించక యొకరికిని బెట్టక దానధర్మమనునది మొదలే లేక వృద్ధాప్యమువరకు అర్థాపేక్షతో అలయుచుండి అవసాన కాలమం దవస్థపడుచుండగా యతనిభార్యజూచి, విచారపడుచు నీవెంత సంపాదించియును అనుభవించుటకు ప్రాప్తము లేకపోయెను. ఇకను ముందు కనుభవించుటకైనను మనకు సంతానములేకపోయెను, నీకిపుడు యేమికావలయునని యున్నదని యడుగగా, నాకేమియు నక్కఱలేదు గాని నావద్దనున్న యీదీపమునందు రెండువొత్తులువేసి చమురు శీఘ్రముగ కాజేసి యవరికొంపగూల్చ నున్నావని అడిగెను. ఇట్లు అవసాన కాలమువరకును అజ్ఞానాంధకారమునందుబడి చెడిపోక, అస్థిరమయినట్టియును, సుఖములేనట్టియును, సారములేనట్టియును, గుణములేనట్టియును, మరణభాజనమైనట్టియును అగు ఆయా[illegible] వస్తువు ప్రపంచమునందు మరియొకటిలేదని [illegible] యెన్నియోతపములుజేసి తెచ్చికొనిన యీజన్మమును వ్యర్థముగా పోనియ్యక శ్రీశంకరులవారు చెప్పినటుల వృథముగ మనస్సును భగవంతునియం దర్పించి జన్మము సార్థకమగునట్లు గడుపవలెను.

(ఈదినము యుపన్యాసాంతమున, శ్రీభాగవతస్వాములవారు సభవారి నుద్దేశించి యిట్లు జెప్పిరి. మీరందరింత శ్రద్ధావంతులై వచ్చి యీవేదాంతశ్రవణమును జేయడమునుజూచి నేను మిక్కిలి సంతసించుచున్నాను. నాశరీరపటుత్వము కొంతమట్టుకు తగ్గుచున్నది. నేను యిచ్చట ఇంకా యెంతకాలము మిట్లు యుపన్యాసము చెయ్యగలనో చెప్పజాలను. నేను ధనార్జనాసక్తుడనై యీయుపన్యాసమును జేయ బూనుకొనినవాడను గాను. నేను యెట్టిశ్రేష్ఠమైన సన్మానము గోరియుండలేదు. శ్రవణకాలమున మీరు తప్పక శ్రమదీసికొనివచ్చి శ్రద్ధగలవారై వినిన విషయములను మరచిపోక మనస్సునందుంచుకొని సదా మననముజేయుచు జ్ఞానవంతులై నాకు సంతోషమును గలుగజేయవలయునను సన్మానమునే గొప్ప సన్మానమని నిశ్చయముగ నేనెంచియున్నాను. అని నిండు పుత్రీవాత్సల్యము నొలుకునట్లు జెప్పిరిగాన సభవారందరును శ్రీస్వాములవారు చెప్పిన నియమమును జవదాటక శిరసావహించియుందురు గాక. ఇట్లు, యీయుపన్యాస సంగ్రహ విలేఖకుడగు సభవారి విధేయుడు.)

